Registered No. M-4345.

# యుద్ధ సంచిక.

వాల్యుం I.] మద్రాసు : 1941 వ సం॥ అక్టోబరు నెల 17 వ తేది శుక్రవారం. [నె 31 రు

## ఇటలీ పస అయిపోయింది.

### జర్మనీకి ఒక భారంగానే వుంది.

### పోపు—రూజువెల్టు సంప్రదింపులు.

"పాంపైను పట్టీలోని బంద్రకప్ప" అని ఇటలీ నియంతయగు ముసోలినీని టర్కీ పాలకుడగు కమాలుపాషా వెనకోసారి వర్ణించేడు. ఆ ముసోలిని రోమునగరంలో తన కోట డాబా ఎక్కి రొమ్ము విరుచుకొని గర్జించుచు, ఇటలీ యితర దేశాలను ఆక్రమించడానికి యుద్ధంలో దిగుతుందని ప్రకటించేడు. ఆ ప్రకటన 1940 వ సం॥ జూన్ 10 వ తేదిన చేసేడు. అప్పటికీ యిప్పటికీ పదహారు నెలలు గడిచేయి. ఇటలీయొక్క సైనిక శక్తి నశించింది. దానితో ఒడంబడిక గావించుకొన్న అక్షరాజ్యాలకు యిపుడదో భారంగానేఉంది. సైనిక సన్నాహాలకు, యితర సహాయాలకు ఇటలీ యిపుడు జర్మనీపై ఆధారపడిఉన్నది. ఆఫ్రికాలో బ్రిటిషు సోమాలీలాండు దేశములోనున్న చిన్న పోలీసు దళాన్ని మొదట గెలిస్తే గెలిచిందేమోకాని, ఇపుడు ఆఫ్రికాలోని ఇటలీ సామ్రాజ్యం అంతా శిథిలమయి, బ్రిటిషువారికి వారి మిత్రరాజ్యాలకు లభించింది. ఆరేండ్లక్రిందట అన్యాయంగా ఇటలీ అబిసీనియాను ఆక్రమించి అచటి చక్రవర్తిని తరిమేసింది. ఇపుడా చక్రవర్తి తిరిగి తన కోట నాక్రమించి దేశాన్ని పరిపాలించుతున్నాడు. ఈజిప్టు ప్రక్కనున్న సిరనైకా దేశంలోని ఇటలీ సైన్యాన్నంత వావల్ సేనాని ఓడించెను. వారిలో వేల కొలది సైనికులు ఖైదీలుగా పట్టుబడి ప్రస్తుతం ఇండియాలో నిర్బంధింపబడియున్నారు. ఇటలీ సేనలును జర్మనీ సేనలు కూడ ఈజిప్టుపై దాడి చేయాలని ప్రయత్నించేయికాని, దాడి చేయలేక పోయినాయి. సిరనైకాలోనున్న టోబ్రుకు నగరం ఇండియా సైన్యంచేత రక్షింపబడుచు యిప్పటికి శత్రు సైన్యాలకు ఎదురుదెబ్బ కొడుతూనేయుంది. ఇటలీ జర్మనీ నౌకలు మధ్యధరా సముద్రంలో యథేచ్ఛగ తిరుగుతున్నాయి. బ్రిటిషు విమానాలు ఇటలీ పరిశ్రమల నగరాలన్నింటిపై తరుచు బాంబులువేసి ధ్వంసంచేస్తున్నాయి. జర్మనీ గెలిచి ఒప్పగించిన దేశాలనుకూడ ఇటలీ అణచి యుంచలేకుండావుంది.

### ఇటలీలో అశాంతి.

ఇటలీ ప్రజలు యుద్ధం అంటే విసిగిపోయే రనుటకు సందేహం లేదు. బ్రిటిషు విమానాలు యిపుడు రోజూసాగిస్తున్న దాడితో యీ శీతకాలం అయ్యేసరికి యింకా విసిగిపోతారు రోము నగరంలోనున్న క్రిష్టియను మతగురువు పోపు అస్థలం విడచి వేరొకచోటికి పోతాడని వార్తలువచ్చేయి. మతగురువు కనుక అతనచటవుంటే బ్రిటిషువారా నగరంపై బాంబులు వేయడానికి వీలు లేకుండావుంది అతను వెళ్లిపోతే యింక బ్రిటిషు విమానదాడికి అడ్డుండదు. ఇటలీలో ప్రజలు అసంతృప్తి చెందియున్నారు. ఆహార పదార్థాలు చాలకుండావున్నాయి. ధరలు విపరీతంగ పెరిగిపోతున్నాయి. ఉత్తర భాగంలో యుద్ధపరికరాలు చేస్తున్న కర్మాగారాలలో కుట్రలవల్ల ద్రోహకార్యాలు జరుగుతున్నాయి. సిసిలీ ద్వీపంలో ముసోలినిగారి ఫాసిస్టు పార్టీకి ప్రతికూల ప్రబోధాలు జరిగేయి. హిట్లరు తత్వంలో జర్మనీకి మిత్రులు భాగస్వాములుగనే యితర దేశాలుండగలవుకాని, సరిసమానమగు దేశంవుండదు. కావున ఇటలీ జర్మనీకి బంటుగానుండే స్థితి వస్తున్నది.

### ఇటలీలో జర్మనుల అధికారం.

ఇటలి జర్మనీల అక్షరాజ్యాల సఖ్యత ఎట్లుందో యీ దిగువ విషయాలబట్టి తెలియగలదు :—

కార్సికా ట్యూనిసు, శావాయి అను మూడురాష్ట్రాలు కావాలని కోరుతు ఇటలీ యుద్ధంలో చేరింది. ప్రతిసైనికుడు ఆ మూడుపేర్లు ఊతపదంగా అరుస్తుండేవాడు. కాని యిపుడేముంది? శావాయిలో ఒక్కపురంలోకూడ ఇటలీవారు కాలుపెట్టడానికి వీలులేకపోయింది. ఫ్రెంచివారి ఆఫ్రికా సామ్రాజ్యములోనున్న కార్సికా ట్యూనిసులగూర్చి వేరే చెప్పనే అక్కరలేదు. ఎంతకాలంనుండో హంగేరీ-ఇటలీ ప్రాబల్యంక్రిందనుండాలని అంగీకరింపబడెను. కాని యిపుడది జర్మనీ వశమయింది. విషీప్రభుత్వంతో జర్మనీ ప్రభుత్వంచేస్తున్న లాలూచీలలో ఇటలీని సంప్రదించనేలేదు.

ఇపుడు ఇటలీ అంతా జర్మనీ సైనికుల వశమందుందని చెప్పవచ్చును. 50,000 జర్మను సైన్యం గత డిసెంబరులో ఇటలీ రేవులందు దిగెను. తరువాత ఆఫ్రికాకు పోతున్న పెద్ద జర్మను సేన ఇటలీ దేశంమీదుగా పోతూ కొంత ఇటలీలో వుండిపోయింది. జర్మనీవారి నాజీ పార్టీ సైనిక నాయకులును ఇటలీవారి ఫాసిస్టు పార్టీ నాయకులు ఒకటై ఇటలీలో జర్మనులకు అధికారం ఎక్కువ యిచ్చిరి. ఇందుకోసరమే ఇటలీ సేనానాయకుడు మార్షలు బొడొగ్లియో రాజీనామా నివ్వవలసివచ్చె ననుకుంటున్నారు.

ఇటలీకి కావలసిన చమురు జర్మనీచేతిలో ఉంది. హిట్లరు తలుచుకుంటే ఇటలీకి బొగ్గు, చమురు, ఇనుము, కలప, తుత్తునాగం ఏదీలేకుండా చేసివేయగలడు. జర్మనీ తాను యుద్ధంలో గెలిచి ఆక్రమించిన దేశాలకు ఎటువంటి షరతులు విధించిందో అటువంటి షరతులతోనే ఇటలీతో ఒడంబడిక గావించుకుంది. కావున ఆర్థికంగా ఇటలీ–జర్మనీకి లోబడివుంది.

అంతేకాక జర్మనుగూఢ చారులు (సి.ఐ.డి. పోలీసులు) ఇటలీలో ఎందరో ముఖ్యమగు ఇటలీ పరిశ్రమలందు పనులలో చేరియున్నారు. లిబియాలో ఎప్పుడైతే ఇటలీ ఓడిందో ఇటలీ ప్రభుత్వానికి దేశంలో కొంతబలం తగ్గిపోయింది. అపుడు దేశంలో సిద్ధంగానున్న జర్మనులు అధికారం తీసుకున్నారు. అందుచే ముసోలిని యిష్టంలేకపోయినా

యిపుడు జర్మనులపై ఆధారపడియున్నాడు. ఈ యేడు ప్రారంభంలోనే తన ఫాసిస్టు పార్టీలో ,చిన్నవారందరిని తొలగించేడు. ఇపుడు మరికొందరు కూడా దేశంలో ఆర్థిక చిక్కులు అసంతృప్తి ననుసరించి తొలగిపోతారు. అపుడు నమ్మకస్తులగు అనుచరులు లేక ముసోలిని జర్మనులపై మరింత ఆధారపడును.

### ఇటలీ వేరుగా సంధిచేసుకుంటుందా ?

ఇటలీ యింత దుస్థితిలో నుండబట్టి వేరే సంధిచేసుకుంటుందా అని సందేహం కలగడం సహజమే. అమెరికా అధ్యక్షుడగు రూజువెల్టుగారి ప్రత్యేక రాయబారి మైరను టేలను గారు పోప్ వద్దకువచ్చి తిరిగి విజో సందేశం అధ్యక్షునకు తీసుకపోయిరి. అదేమయి యుంటుందా అని అనేకులనేక విధములుగ అనుకుంటున్నారు. ప్రత్యేకంగా సంధిచేసుకోవాలని ఇటలీ ఆశపడినా జర్మనీ ఒప్పుకోదని బ్రిటిషు ప్రభుత్వంవారనుకుంటున్నారు. ఇటలీ స్వంతబలం అంతాపోయినా మధ్యగా నుండుటచే అనేకవిధాల హిట్లరుకి ఉపయోగపడుతుంది. తన చేతిక్రింద ఇటలీని ఉంచుకుంటే ఇటలీ రేవులనుండి బ్రిటను మిత్ర దేశాలపై దాడి చేయడానికి హిట్లరుకు వీలుంటుంది కనుక ఇటలీ మైత్రిని హిట్లరు వదలడు. ఇటలీ రాజవంశంవారున్నూ, మతగురువులున్నూ శాంతినే కోరవచ్చును.

కాని పాపమువారి ఆటసాగనిస్తాడా హిట్లర్ ఇటలీ ప్రభుత్వాధికారులు యుద్ధంలోనుండి తప్పించుకొని పోదామనుకుంటున్నారని తెలియగానే వారిని పడగొట్టుటకు ఇటలీలోవున్న జర్మనులు ప్రయత్నిస్తారు. అందుచేతే ఏమయితే నేం ముసోలిని యిష్టం ప్రకారమే కానీ అని తక్కినవారంతా పూరుకున్నారు. పోపు అమెరికా అధ్యక్షుడికి ఏమి సందేశం పంపేడో చెప్పలేం. కాని ఇటలీ యుద్ధంలోనుండి తప్పించుకోవాలంటే మాత్రం యింతకన్న మంచి సమయం వుండదు. జర్మనులు రష్యాతో తెరిపిలేని యుద్ధం సాగిస్తు నిమగ్నులై యున్నపుడే ఇటలీ తప్పించుకోవాలి. రాజనీతి తంత్రంలో ఏదేనా అవకాశంవుంటే యిలాంటి ప్రయత్నం సాగించడానికి పోపుగారే సమర్థులు. అయితే ఉత్తరాఫ్రికాలో యుద్ధఫలితం తేలంది ఇటలీ విషయం నిర్ణయింపజాలదు. ఇటలీ నీరసించినకొలది జర్మనీకి కష్టమే. ఇటలీలో తగ్గిపోయిన సైనిక శక్తి అంతాను ఆర్థికసంపదంతాను జర్మనీ భర్తీచేయాలి. ఇప్పటికే రష్యాతో జర్మనీపని తింటారవుతున్నది. జర్మనీ సహాయంలేనిది ఇటలీ కోలుకోలేదు. రష్యాపైకి ఏడు డివిజనుల (1 డివిజను 12,000 సుమారు) సైన్యం పంపుమని హిట్లరు కోరగా ముసోలిని మూడు డివిజనులుమాత్రం పంపెను. వాటికి తగిన ఆయుధాలు యివ్వలేక పోయెను. అందుచే ఇటలీ జర్మనీకిగుదిబండవంటిదేగాని ఉపకరించే దేశం కాదని చెప్పవచ్చును.

## జర్మనీలో సైన్సు హత్య.

**నాజీపక్షంవారు ఉపాధ్యాయులను తరిమేసి, గ్రంథాలు మంటపెట్టి, విద్యానాశనం చేయుట.**

నూరేండ్ల నుండి జర్మను దేశం శాస్త్రపరిశోధనకు విజ్ఞానానికి పేరుపడింది. ప్రపంచంలో అన్ని ప్రాంతాలవారికి శాస్త్రములన్నీ జర్మను పండితులే బోధిస్తూవుండిరి. అనేక దేశాలనుండి విద్యార్థులు జర్మనీకివచ్చి సకల శాస్త్రాలు నేర్చుకుంటూవుండేవారు. బ్రిటను-అమెరికా శాస్త్రజ్ఞులు తమ విశ్వవిద్యాలలో చదువు ముగించేక, జర్మనీ విశ్వవిద్యాలయాలకు పోయి ఉన్నత విద్యపొంది పరిశోధనలు చేయుచుండుట పరిపాటయింది. ప్రపంచానికంతకు విద్యాధికులను గౌరవించి బిరుదులిచ్చు నోబిలు బహుమతీ సంస్థవద్ద, 40 బహుమతులు జర్మనీ విద్యాధికులేబడసిరి. గత యుద్ధానంతరం 1920-30 సం॥ల మధ్య జర్మనీలో గణిత శాస్త్రం, భౌతిక శాస్త్రం, రసాయన శాస్త్రం, క్రిమి శాస్త్రం మున్నగు శాస్త్రములన్నింటి పరిశోధనాలయములు పెరిగి, ప్రపంచంలో విద్యార్థులను పండితులందరిని ఆకర్షిస్తూవుండేవి.

అట్టి జర్మనీదేశంలో విద్యాధిక్యత అంతా కొద్దివారాలలోనే హిట్లరు యొక్క నాజీపార్టీవారు నాశనం చేసేరు. నాజీ పక్షంవారికి అన్ని దేశాలకు ఉపయోగించే శాస్త్రవిజ్ఞానాలక్కరలేదు. విజ్ఞానంకోసమే శాస్త్ర పరిశోధన చేయడం వారికి పనికిరాదు. జర్మనీ ప్రజలు ఆరోగ్యంగా బలంగా వుండడంకొరకు వారు వైద్యం నేర్చుకొంటారుగాని, వైద్యశాస్త్ర మర్మం తెలుసుకోడానికి కాదు. అట్లే చరిత్ర చదవడం కూడ ప్రాతదేశ కథనుండి జర్మను ప్రజల ముందుకర్తవ్యం బోధించడానికే. శాస్త్ర పరనం, జర్మను ప్రజలు యితర దేశ ప్రజలతో యుద్ధం చేసి గెలవడానికి క్రొత్త ఆయుధాలను కనిపెట్టడానికే. అని గోటింజెను అను సుప్రసిద్ధ జర్మను విశ్వవిద్యాలయంలోని పెద్ద ఉద్యోగి యొకడు 1934 వ సం॥లో చెప్పేడు. ఇటువంటి స్వార్థ లాభాల కొరకు విశ్వవిద్యాలయాలు పని చేయాలని నాజీ పార్టీవారి ఉద్దేశం. అందుకే మహా పండితులను, ప్రొఫెసరులను పెక్కు విశ్వవిద్యాలయముల పనులలో నుండి మొత్తం 2,500 మందిని 1933-37 వ సంవత్సరాలలో తొలగించిరి. విద్యార్థుల సంఖ్య 116,000 నుండి 67,000 వరకు తగ్గింది. హిడెలుబర్గు అను మరో పెద్ద విశ్వవిద్యాలయంలో వేదాంత శాఖాధికారిగా ఎలిమెంటరీ పాఠశాల ఉపాధ్యాయుడు ఒకడిని నియమించేరు. అతడు నాజీపార్టీకి మంచి ప్రచారం చేసేడు. అదే అతని అర్హత. ఇట్లాగే రాజకీయ పార్టీ ప్రయోజనానికి ఉపయోగపడే సామాన్యులను ఉన్నత విద్యాధికారులుగ నియమించి, వేలకొలది మహా పండితులను తొలగించేరు.

డా॥ రస్టు అనువాడు 1909 వ సంవత్సరము నుండి 1930 వ సంవత్సరము వరకు సామాన్యపు ఉపాధ్యాయుడుగ వుండి, మెదడు చెడి పనిమానుకొనెను. మరి మూడేండ్లకు అతన్ని విద్యాశాఖమంత్రిగను, జాతీయ పునరుద్ధరణ శాఖ అధికారిగను హిట్లరు నియమించేడు. అన్ని శాస్త్రాలబోధ అణచివేసి, యుద్ధానికి ఆయుధాలను

పెంచడానికి ఉపయోగపడు రసాయన శాస్త్రం ఇంజనీరింగు మాత్రం ఎక్కువగా కృషి చేస్తున్నారు. జాతి ద్వేషాలను అనుసరించి కొందరు మహాపండితులు ఉద్యోగాల నుండి తొలగింపబడిరి. నోబిలు ప్రైజు పుచ్చుకున్న శాస్త్రజ్ఞులు ఈంస్టీను మున్నగువారిని ఆర్యురని, జర్మను యువకులకు బోధించుటకు అసమర్థులుగ ఎంచి, క్రొత్తమంత్రి వారిని పనులలో నుండి తొలగించెను. డా॥ రస్టు, యీ యేడు ఏప్రిలులో జర్మను భావినాయకులను తయారుచేయు ట్రెయినింగు స్కూలు ప్రారంభోత్సవం జరుపుచు, భూమంతా యుద్ధరంగంగా ఉండుటకే సృష్టికర్త సృష్టించేడనియు, అందునివసించుటకు తగినవారిని హిట్లరు తయారు చేసేడనియు చెప్పెను. జర్మనీ సైన్యంలో సైనికులే, పాఠశాలలలో ఉపాధ్యాయులుగ నియమింపబడుదురు. ఇక ముందుగూడ, నాజీపక్షాభిమానంబట్టియె ఉపాధ్యాయులు నియమింపబడుదురనియు, శాస్త్రవిజ్ఞానార్హతబట్టి నియమింపబడరనియు డా॥ రస్టు బహిరంగంగా ప్రకటించెను కాయకష్టపడి పనిచేయుటే జీవితప్రయోజనంగా యెంచు ప్రజలే, యుద్ధం ఒక ఆటగా యెంచువారే ప్రపంచంలో ఆధిపత్యం వహించగలరని, ఆతడు ప్రకటించెను. ఇట్టి భావాలతో నాజీ నాయకులు శాస్త్రాన్నంత హత్యచేసి దౌర్జన్యమే ప్రధానంగా ప్రబోధించుచున్నారు.

---

# రష్యాలో విషమస్థితి.

## మాస్కో నగరంకోసం భీషణయుద్ధం.

రష్యాపై జర్మనీ మూడోసారి దాడి ప్రారంభించి యిప్పటికి పదునేడురోజులయింది. ఈ దెబ్బతో శీతాకాలం వచ్చేలోగా పూర్తిగ విజయంపొందాలను పట్టుదలతో హిట్లరు తనబలమంతా ఉపయోగిస్తున్నాడు. చలికాలంవచ్చినా సైనికచర్యలు నిలచిపోవు. కాని పైదేశంనుండి దాడివచ్చే సైన్యాలకు కొన్ని కష్టాలుంటాయి. వెనుకదూరాననుండు తమ స్వదేశంలో సైనికశిబిరాలతో యీసైన్యం రాకపోకలు తెగిపోకుండా చూచుకోవాలి. అపుడే మంచుపడుట ప్రారంభమయింది. నవంబరు రెండోవారంసరికి రష్యాఅంతా సహించలేని చలిగావుంటుంది. అంతవరకు హిట్లరు సేనలు నిలచియుండగలిగితే, తగని చలికాలంలోకూడ హిట్లరు యుద్ధం కొనసాగించాల్సి ఉంటుంది. ఆ చలి రష్యా సైన్యాలకు అలవాటే. ఈలోగా బ్రిటను అమెరికాలనుండి ఎక్కువ సహాయం రష్యాకు అందును. అందుచే వసంతకాలంవచ్చేసరికి జర్మనులను ఓడించుట సులభమవుతుంది.

బ్రిటిషుమంత్రి బివరు బ్రూకుప్రభువు మాస్కోలో జరిగిన ఇంగ్లాండు, అమెరికా, రష్యాప్రభుత్వాల సభనుండి లండను రాగానే, రష్యా కోరిన టాంకులు విమానాలన్నీ యిచ్చుటకు బ్రిటను, అమెరికాలు వాగ్దానంచేసేయని చెప్పెను. అంతేకాక బరువైన యితర యుద్ధపరికరాలుకూడా యిస్తామన్నారు. ఈసందర్భంలో రష్యాను విడువమని, హిట్లరును స్టాలిను ఎదిరించి నిలువగల్గుననియు బివరు బ్రూకుగారు నమ్మకంగా చెప్పేరు. 30,000 టాంకులు త్వరగా తయారుచేయుమని బ్రిటిషు కార్మికులను హెచ్చరించేరు. అమెరికాలో అధ్యక్షుడు రూజువెల్టుగారు మాట్లాడుతూ, రష్యా యుద్ధరంగంలో యుదంతములనుబట్టి తాము సహాయంచేసే కార్యవిధానం మార్చుకోమని చెప్పేరు. ఇతరదేశాలకు ఆయుధాలు వగయిరా అరువుయిచ్చుటకు అమెరికా ఒకచట్టం గావించియుండెను. అది రష్యాకు సహాయంచేయడానికికూడ వర్తిస్తుందని అమెరికా శాసనసభ తీర్మానించింది. స్టాలిను స్వయంగా యుద్ధం జరుగుచున్నచోటికి పోయిచూచి, జర్మను సేనలను రష్యాసేనలు ఓడించగలవని సంతృప్తి చెందెను.

### మాస్కోరంగం.

అట్లని రష్యా యుద్ధరంగంలో స్థితి ఆందోళన కలిగించలేదనుకోరాదు. రష్యా ముఖ్యనగరమగు మాస్కోపై శత్రుదాడి విరమింపబడునో లేక లెనిన్గ్రాడువలె ఆనగరంకూడ దీర్ఘకాలం దాడి నెదిరించి నిలచియుండునో కొద్దిరోజులలో తెలుస్తుంది. మధ్యరంగంలో జర్మనుసేనలు యార్టుజావో నుండి ఓరలువరకు ఒక్కుమ్మడి దాడి సాగించినవి. ఇచట విశేషసైన్యమును జర్మనీ కేంద్రీకరించినది. ముఖ్యంగా టాంకులు, విమానాలు పంపింది. ఓరలు, వియాజ్మా, బ్రియంస్కు నగరాలచుట్టు అసాధారణమగు భీషణయుద్ధం జరిగినది. ఇరుపక్షాలవారు విశేషసైన్యాల నచటకు పంపిరి. ఒకపక్షం రోజులు నిలువరించుకొని, జర్మనులను పలువురనుచంపి చాల నష్టపెట్టినతరువాత యీ మూడునగరాలను రష్యను సేనలు ఖాళీచేసినవి. సన్నిమార్గాన జర్మనుసేన లనేకం మాస్కోకు 65 మైళ్ల దూరాన ఉన్న మొజాస్కువరకు వచ్చినవి. కాని రష్యనులు వాటిని వెనుకకు తరిమివేశారు. ఈ తిరుగుదాడులే ఎంతో ప్రోత్సాహకరంగా ఉన్నాయి. అనేకలక్షల మంది రష్యనులను బంధీలుగా పట్టుకున్నామని జర్మను అధికారులు నమ్మడానికి వీలులేని ప్రకటనలు చేస్తున్నారు. అయినా రష్యనులు తిరిగి దెబ్బకొడుతూ ధైర్యంతోనే వున్నారు. ఈవారంలో జర్మనుల విమానశక్తి రష్యనుల శక్తికన్న ఎక్కువగ అగుపడింది. కాని రష్యా బాంబరు విమానాలు, ఫైటరు విమానాలు క్రొత్తవి విశేషంగా వచ్చి నేలసైన్యాలకు యిపుడు సహాయంచేస్తున్నాయి. మాస్కోనుండి తెంపులేకుండా సైన్యం చీమలబారువలె పడమరను యుద్ధరంగానికి పోతూనేవుంది. మాస్కో యుద్ధంలో జర్మనీ గెలిచినా, చాలసైన్యాన్ని సరకును వదలుకొని అలసి, తిరిగి ఎంతకాలంవరకో కోలుకోజాలదని అమెరికను నిపుణులు చెపుతున్నారు. రష్యా ముఖ్యపట్నంపై జర్మనీదాడి అపుడే వడి తగ్గింది.

### దక్షిణ రంగం.

రష్యా దక్షిణానవున్న అజోవు సముద్రతీరమంతా ఆక్రమించామని, రష్యాయొక్క 9, 18 నెంబరు సైన్యాలను రూపుమాపేశామని జర్మను సైనికాధికారులు చేసే ప్రకటన నమ్మడానికి వీలులేదు. అయినా క్రిమియా ద్వీపకల్పానికి, కాకసను ప్రాంతాలకు ప్రమాదంగలదని ఒప్పుకోక తప్పదు. మధ్యరంగంలోవలెనే యిచటకూడ రష్యను సేనలు తీవ్రనిరోధం చేస్తున్నాయి. యుక్రైనులో పాల్టావానుండి కార్కోవువరకు పోతున్న జర్మనుసేన ఎంతో ముందుకుపోలేదు. ఉత్తరాన లెనిన్గ్రాడు రేవుపట్నం యింకా ముట్టడిచేసిన శత్రుసైన్యాలను నిరోధిస్తూనే ఉన్నది. అంతకన్న ఉత్తరాన వున్న మార్మంస్కువద్ద శత్రువుల సందడే లేదు.

జర్మను ప్రచారకశాఖవారు చాల ఆశలుగొల్పు ప్రకటనలు చేస్తూవుంటారు. వారిమిత్రులగు ఇటలీవారే వాటిని నమ్మలేదు. "లాస్టాంపా" అను ఇటలీ పత్రిక రష్యా సేనలను జర్మను సేనలు చుట్టివేయలేకున్నవి కావున రష్యాయుద్ధం యింకా ముగియలేదని వ్రాసింది. రష్యను సేనపై శీతకాలం తరువాత వసంతకాలంలోకూడ దాడి జరుపవలసివుంటుందనియు, శీతకాలంలో రష్యాసేన కోలుకొని పెరుగుననియు, ఆపత్రిక వ్రాసెను. పైగా లక్షలకొలదియున్న జర్మను సేనలకు స్వదేశంనుండి సప్లయిలుచేరుట కష్టమసెను. రష్యా సైన్యమూ, విమానాలునూ విరామంలేకుండా గుండ్లు ప్రేలుస్తున్నందున జర్మను సేనలకు మార్గాలు యేర్పరచుచున్న పనివారు చేతులలో తుపాకులుంచుకొనియే సర్వదా పనిచేస్తున్నారని ఆపత్రిక తెలుపుచున్నది. దీనిబట్టి రష్యాలోనున్న జర్మనుసేన కష్టాలెట్టివో స్పష్టమగుచున్నది.

---

# అసాబులో పంజాబు సైనికుల ఘనకార్యములు.

## ఇటలీ రేడియో అసత్య ప్రచారం.

పంజాబు 15 వ రెజిమెంటు సైన్యము ఇటలీ వారి ఇరిత్రియాలోని రేవు స్థలమయిన అసాబు నగరం వశపరచుకున్న తరువాత ఆ నగరంలో సత్పరిపాలన స్థాపించవలసివచ్చెను. ఇంకను మిగిలియున్న శత్రువులను లొంగదీయు కార్యంతోపాటు, సైనికులకు యీ పరిపాలనా బాధ్యతకూడ తగిలింది. వారి సంఖ్యకూడ అందుకు తగినంతలేదు. అయినా వారిలో వారే సేనానాయకుడు ప్రధానమంత్రిగను, తక్కిన పెద్దలు కొందరు యితర మంత్రులగనుండి ఒకపరిపాలకవర్గం ఏర్పరచుకొనిరి. ఊరిలో ఆహారపదార్థాలు చాలవు. యెమను అనుదూరంగావున్న యింకో నగరం నుండి తెచ్చుకోవలసియుండెను. యెమనులో వారు ఇటలీ నాణెమగు "లీరా" లను పుచ్చుకోరు. అందుచే అసాబులో మిగిలియున్న చక్కెరను యెమను వర్తకులకిచ్చి బదిలీగా యితర పదార్థాను పుచ్చుకొనిరి.

పంజాబు సైన్యం అసాబును ఆక్రమించకముందు ఇటలీ సైనికులు ఆపురాన్ని చండశాసనంగా పరిపాలించిరి. మునిసిపాలిటీని అణచివేసిరి. ఆ మునిసిపాలిటీని వీరు పునరుద్ధరించిరి. భారతీయ సైన్యం ఓడిపోయిందని, భారతీయ సైనికులు క్రూరులని ఇటలీ అధికారులు అంతకముందు ప్రచారం చేసేరు. అందుచే అసాబులో ఉన్న ఇటలీ స్త్రీలు భయపడిపోయేరు. కాని పంజాబీలు వచ్చిచేరిన తరువాత, వారికి నిజం తెలిసి భయంపోయింది. మూడు రోజులలో నగరం అంతా మామూలు ప్రకారం శాంతంగ పరిపాలింపబడుతున్నది. చేరువ సుడాను గ్రామంలో కొంతలూటీ జరిగింది. ఆ లూటీ చేసినవారిని పంజాబు సైనికులు వూరు మధ్యకు తెచ్చి రెండు రోజులు అందరిముందరపెట్టి దెబ్బలు కొట్టు సరికి, మరునాడు మరి లూటీజరుగలేదు.

ఇటలీ సైన్యం అసాబు విడిచిపోతున్నపుడు రేడియో యంత్రాలను మాత్రం తీసుకపోలేదు. ఆనగరంపై భారతీయసైన్యం బ్రిటిషు విమానాలు నౌకలు విపరీతముగావచ్చి పది గంటలసేపు ముట్టడి చేశాయని, నగరంలోనున్న ఇటలీ సైన్యం సహజమగు ధైర్యసాహసాలతో తీవ్రంగా ఎదిరించినదని, ఇటలీ ముఖ్యపట్నమగు రోమునగరం రేడియోనుండి ప్రచారం చేయబడెను. అదంతావిన్న అసాబు నివాసులకు నవ్వువచ్చింది. ఎందుకంటే, అసలు జరిగింది వేరు. అట్టి నిరోధం లేకుండానే పంజాబీలకు యీ నగరం వశమయిపోయింది. ఒక్కడు మాత్రం కొట్లాటలో చనిపోయేడు. ఈ మాత్రం దానికి పది గంటలు ఘోరయుద్ధం జరిగిందని రోమునుండి ప్రగల్భాలు చెపుతూవుంటే, నిజంతెలిసిన అసాబు వాసులకు, ఆకబుర్లు వింతగ తోచేయి. ఈ రేడియో అసత్య ప్రచారం వల్ల ఇటలీ అధికారుల ప్రచారం అంటే అసాబువాసులకు పూర్తిగనమ్మకం పోయింది.

---

# ఈ వారం యుద్ధ వార్తలు.

## విమాన యుద్ధము.

ఈ వారం ఆరంభంలో, ఉత్తర ఐరోపాలో వాతావర్ణం అనుకూలంగాలేదు. అయినా, బ్రిటిషు నౌకా విమానాలు, నార్వే ప్రాంతపు సముద్రములవరకూ గస్తీ తిరుగుతూ శత్రు నౌకలను, రేవులను యెదిర్చి ధ్వంసం చేయుచునేవున్నవి. 9 వ తేదిన ఫ్రెంచి కోస్తా రేవులమీద తీవ్రమైన దాడి జరిగెను. 10 వ తేదిన 200 బ్రిటిషు విమానాలు బయిలుదేరి ఫ్రాన్సులో ఉత్తర భాగంమీద, బెల్జియం, హాలండు రేవులమీద, జర్మనీలో పారిశ్రామిక పట్నాలు విశేషంగావున్న రైనురూర్ ప్రాంతాలమీద వేలకొలది బాంబులు వర్షించినవి. హాలండులో, జర్మను విమానాశ్రయమొకటి పూర్తిగా తగులబడిపోయింది 11 తేదిన వందలకొలది. బ్రిటిషు విమానములు జర్మనీ వాయవ్యప్రాంతంమీద బ్రహ్మాండమగు దాడి సాగించినవి. ఎండెన్ రేవునందలి నౌకా నిర్మాణశాలలు చాలవరకు ధ్వంసమైనవి. నార్వే తీరంలో సైన్యములను, సప్లైలను తీసుకొని వెళ్లుచున్న జర్మను నౌకలు ముంచివేయబడెను. 12 తేది రాత్రి 300 బ్రిటిషు విమానాలు జర్మనీలోని బవేరియా, రైను ప్రాంతం, వాయవ్య ప్రాంతంలోని పారిశ్రామిక పట్నాలమీద భయంకరమగు దాడిని సాగించినవి. యుద్ధారంభంనుండి, జర్మనీపై ఇంత పెద్ద దాడి ఇదివరకెన్నడును జరుగలేదు. నాజీపక్షమువారి ప్రధాన స్థానమగు న్యూరెంబర్గునగరము ఇంచుమించు పూర్తిగా ధ్వంసం చేయబడెను. 13 తేది మధ్యాహ్నం ఫ్రాన్సు ఉత్తర భాగంమీద బ్రిటిషు విమానాలు దాడిచేసి 19 జర్మను విమానములను పడగొట్టెను. 9 బ్రిటిషు విమానాలు తిరిగిరాలేదు. ఆ రోజున వాతావరణం కొంచెం అనుకూలంగా వుంది. అందుచేత బ్రిటిషు విమానాలు జర్మనీమీద, ఫ్రాన్సులోని ఆక్రమిత ప్రాంతాలమీద, రాత్రి దాడి, పగలు దాడి కూడతిరిగి ప్రారంభించాయి. 14 తేది రాత్రి, బ్రిటిషు విమానములు, జర్మనీలో దక్షిణ ప్రాంతపు పట్నాలమీద దాడి సాగించెను. ఈ దాడినుండి ఒక విమానం తిరిగి రాలేదు.

# తూర్పు ఇండియా విమాన దళం.




బ్రిటిషు యుద్ధ సహాయానికై ఇండియా తూర్పు భాగములందు వసూలైన చందాల నిధినుండి రెండు "స్పిట్ఫైరు" యుద్ధ విమాన దళములు కొన్నారు. అవి యిపుడు రాయలు విమాన దళము నందుచేరి యుద్ధంచేస్తున్నవి. ఒక వైమానికుడు జయప్రదముగ దాడి ముగించివచ్చినాక తీసిన పటము.

---

బ్రిటనుపై జర్మను విమానదాడి, ఈ వారముగూడ చాల తగ్గినది. 9 వ తేది రాత్రి జర్మను విమానం ఒకటి మాత్రం, బ్రిటను దక్షిణ తీరంలో ఒక పట్నంమీదకు వచ్చి బాంబులు వేసెను. కొన్ని కట్టడములు శిథిలమైనవి. కొంత మందికి దెబ్బలు తగిలినవి. 10 వ తేది రాత్రి మరికొన్ని విమానాలు వచ్చినవి. వానిలో ఒకదానిని బ్రిటిషు విమానాలు పడగొట్టినవి. మిగిలినవి యెక్కువ నష్టం కల్గించక పూర్వమే మరలిపోయినవి. 11వ తేది రాత్రిగూడ, ఇంగ్లండు నైరుతి భాగంలోను, దక్షిణ భాగంలోను కొన్ని బాంబులు పడెను. రెండు శత్రు విమానాలు ఒక బ్రిటిషు విమానంతో ఢీకొని పడిపోయినవి. ఆ బ్రిటిషు విమానంకూడా శిథిలమైపోయినది. 12 వ తేది రాత్రిగూడ శత్రు విమానాలు చాల తక్కువగనే వచ్చినవి. వానిలో ఒకటి పడగొట్టబడింది. 13 వ తేది రాత్రి దాడులలో ఒకపట్నంలో కొంత మందికి దెబ్బలు తగిలినవిగాని ప్రాణనష్టం ఏమీ కలుగ లేదు.

### టర్కీ-ఇరాక్-ఇరాన్.

ఈ నెల 9 వ తేదీన టర్కీ-జర్మనీ ప్రభుత్వాలు, క్రొత్తగా ఒక వర్తకపు ఒడంబడిక చేసుకున్నాయి. ఆ ఒడంబడిక పత్రంమీద, టర్కీ రాజధానియగు అంకారా నగరంలో ఉభయపక్షముల ప్రతినిధులు సంతకములు పెట్టారు. ఈ ఒడంబడిక ప్రకారం టర్కీ 1943 వ సంవత్సరము లోగా 20 కోట్ల మార్కుల (జర్మను నాణెం) సరకు అమ్మడానికి అంగీకరించింది. జర్మనీకూడా అంత విలువగల సరకునే టర్కీకి అమ్మడానికి అంగీకరించింది.

ఈ ఒడంబడిక విషయమై ఉభయపక్షములకూ రాయబారాలు చాల రోజులు సాగెను. ఒక సమయంలో ఒడంబడిక కుదరక, జర్మను ప్రతినిధులు వెళ్లబోతారని కూడా అనుకున్నారు. ఈ విభేదాలకు ముఖ్యకారణం "క్రోము" అనే పదార్థమునుగురించి. ఇది ఇనుప పరిశ్రమలలోను, ఆయుధనిర్మాణ పరిశ్రమలలోను విశేషంగా ఉపయోగపడు

తుంది. తమ దేశంలో ఉత్పత్తిఅయ్యే క్రోములో ఎగుమతి చేయడానికి లభించే సరకును అంతా బ్రిటను, ఫ్రాన్సులకు విక్రయించుటకు, 1940 వ సంవత్సరములో టర్కీ ఒడంబడిక చేసుకున్నది. ఆ ఒడంబడిక 1942 వ సంవత్సరము వరకు అమలులో వుంటుంది. జర్మనులు ఇప్పటి నుండి కొంత క్రోమును జర్మనీకి కూడా విక్రయించవలసిందని ఈ సంభాషణలలో పట్టుపట్టిరి. టర్కీలో బ్రిటను పలుకుబడి తగ్గిపోయిందని ప్రపంచానికి చూపడమే ఈ కోర్కె యొక్క వుద్దేశం. కాని టర్కీ లొంగలేదు. 1942 వ సంవత్సరమువరకూ జర్మనీకి క్రోమును విమాత్రం విక్రయించనని స్పష్టంగా తెలిపింది. తుదకు 1943, 1944 వ సంవత్సరాలలో మాత్రం సాలీనా 90 వేల టన్నుల క్రోము—అనగా, టర్కీ యెగుమతులలో సగభాగం—జర్మనీకి విక్రయించడానికి టర్కీ ప్రభుత్వం ఒప్పుకుంది. అదైనా—జర్మనీ అంతకు ముందుగా, టర్కీకి వాగ్దానంచేసిన ఆయుధ సామగ్రిని అందజేసిననేగాని, క్రోమును జర్మనీకి పంపమని టర్కీ ప్రతినిధులు వెల్లడించారు. తుదకు జర్మను ప్రభుత్వం ఎట్టి షరతులకైనా, ఒక ఒడంబడికను కుదుర్చుకు రావలసిందని సూచనలు పంపింది. అందుచేత సంతకాలు జరిగాయి. ఒడంబడిక కుదరలేదని ప్రపంచానికి తెలిస్తే జర్మనీకి పరాభవంగా వుంటుందనే భయంవలన జర్మనులు ఈ ఒడంబడికపై సంతకము చేశారు. ఈ లోగా జర్మనులు యెంత బెదరించినా, టర్కీ ప్రభుత్వం బ్రిటనను త్రోసిపుచ్చడానికి ఏ మాత్రం అంగీకరించలేదు. ఈ విధంగా వేరుకు ఒడంబడిక కుదిరినా, జర్మనీకి టర్కీలో గొప్ప పరాభవమే జరిగిందని చెప్పాలి.

ఇరాక్ (పర్షియా) శాసనసభ ఈ నెల 11 వ తేదిన సమావేశమైనది. కొత్త రాజగు మహమ్మదు రిజాగారు తాను దేశంలోను, ప్రభుత్వంలోను తలపెట్టిన సంస్కరణల వెల్లడించి శాసనసభ్యులను పూర్తిగా సహాయం చేయవలసినదని కోరిరి. శాసనసభ్యులు సహకారం చెయ్యడానికి అంగీకరించారు.

ఇంతవరకు ఇరాక్‌లో షా (రాజే) సైన్యాలకు ప్రధాన సేనానాయకుడుగ నుంటున్నాడు. ఇకమీద రాజునకు సేనా నాయకత్వపు పదవిని తొలగించుచు, శాసనసభవారొక శాసనం చేశారు.

ఇరాక్, ఇరాక్‌దేశములలోని జపానీయులు ఖాళీచేసి స్వదేశమునకు మరలి పోవుచున్నారు.

## అమెరికా-అట్లాంటిక్.

అమెరికా ''తటస్థ శాసనము''ను త్వరితంగా సవరించవలెనని తెలుపుచూ, రూజ్వెల్టు అధ్యక్షుడు అమెరికను శాసనసభలకు 9 వ తేదిన ఒక సందేశం పంపించాడు. (1) అమెరికను వర్తక నౌకలకు ఫిరంగులను అమర్చరాదనీ, (2) యుద్ధం జరుగుచున్న ప్రాంతాలను, అమెరికను వర్తక నౌకలు ప్రవేశింపరాదనీ, సదరు తటస్థ శాసనంలో నిషేధింపబడివున్నది. ఈ రెండు నిషేధాలను తొలగింపవలెనని రూజ్వెల్టు అధ్యక్షుని సూచన.

జర్మనులు, సముద్రాలమీద యెట్టి విచక్షణయు లేకుండ అమెరికను నౌకలను, ఇతరుల నౌకలనుగూడ ముంచివేస్తున్నారు. కనుక, వారి వుపద్రవం తప్పించుకొని ఆత్మరక్షణ చేసుకోడానికిగాను, ప్రతి అమెరికను వర్తక నౌకకునుగూడ ఫిరంగులను అమర్చుట అవసరమని రూజ్వెల్టు తెలుపుతున్నాడు. అక్షరాజ్యాలు గెలిస్తే అమెరికాకు వుపద్రవం అధికమనీ, అట్టి విజయాన్ని అసంభవంగా చేయడానికిగాను, బ్రిటనుకు అక్షరాజ్యాలను ప్రతిఘటించి పోరాడుచున్న ఇతరదేశాలకు అరువుగాను, కవులుగాను ఆయుధాలను ఆహారపదార్థాలను సప్లై చేయడానికి అమెరికా ప్రభుత్వం నిశ్చయించుకొని వున్నది. ఈ నిశ్చయాన్ని అమలు జరుపాలంటే, సదరు యుద్ధ సామగ్రిని మిత్రమండలి దేశాలకు అమెరికను నౌకలలోనే చేరవేయడం అవసరం కనుక, ప్రస్తుతమున్న నిషేధాన్ని తొలగించవలెనని రూజ్వెల్టు తెలియజేశాడు.

ఈ రెండు సూచనలను పరిశీలించడానికి శాసనసభల విదేశీయ స్థాయి సంఘంవారు వెంటనే విచారణ ప్రారంభించారు. శాసనసభా విదేశ స్థాయి సంఘంవారు, అమెరికను నౌకలకు ఆయుధముల నమర్చుట కనుమతించేలాగ తటస్థ శాసనమును సవరింపవలెనని తీర్మానించారు.

ఇదిగాక, అరువు కవులు పద్ధతులలో మరి 500 కోట్ల డాలర్ల విలువగల సరకును మిత్రమండలి రాజ్యాలకు సప్లై చేయుటకు అనుమతిని కోరుచు మరియొక చట్టమును శాసనసభలో ప్రవేశపెట్టిరి. రష్యాకు సహాయం, ఆ చట్టం క్రింద చేయరాదని కొందరు ఆక్షేపించారు. కాని అధిక సంఖ్యాకబలంతో శాసనసభవారు వారి సవరణను త్రోసివేశారు. సవరణకు అనుకూలంగా 70, ప్రతికూలంగా 365 వోటులు వచ్చాయి. ఈ చట్టం ప్రజాప్రతినిధుల సభలో మొదటి సారి ఆమోదింపబడింది.

'' బస్కో '' అను జర్మను నౌకను, అమెరికను నౌకాధికారులు గ్రీన్‌లాండువద్ద పట్టుకొని, నావికులతో సహా అమెరికాకు తీసుకునివచ్చారు. జర్మను నౌకా సిబ్బందిని ప్రత్యేకముగా నెలకొల్పబడు శిబిరములలో ప్రవాసమునందుంచెదరు.

ఈ నెల 9 వ తేదిన మధ్య అమెరికాలోని పెనామా రాష్ట్రంలో, ప్రభుత్వకార్యదర్శి డిలాగార్డియా అను నతడు తిరుగబాటుచేసి, ప్రభుపతింవారిని ఖైదులోవుంచి, ప్రభుత్వాన్ని తానే స్వాధీనంచేసుకుని పరిపాలిస్తున్నాడు. ప్రభుత్వాధ్యక్షుడగు అరియస్‌గారీ సమయంలో కార్యాంతరాల మీద ఇతర దేశాలకువెళ్లియున్నాడు. డిలాగార్డియాగారి నాయకత్వంక్రింద యేర్పడిన ప్రభుత్వం మిత్రమండలికి అనుకూలమైనదనీ, నియంతలకు ప్రతికూలమైనదనీ అనుకుంటున్నారు.

## ఇటలీ, ఆఫ్రికా, మధ్యధరం.

వెనుక, ఇటలీ ప్రభుత్వ విదేశాంగమంత్రిగనున్న కౌంటు స్ఫోర్జాగారు 12 వ తేదిన అమెరికానుండి రేడియోలో ప్రసంగిస్తూ, జర్మనీకొరకు ఇటలీ తన ప్రజల రక్తాన్నంతా ప్రవహింపచేస్తున్నదనియు, ఇప్పటికైనను ఇటలీ జర్మనీని వదలి, ఆంగ్ల-అమెరికాదేశములతో కలియుటమంచిదనియు హెచ్చరించెను. ఉత్తర ఆఫ్రికారంగంలో ఈజిప్టు లిబియా (ఇటాలియను) సరిహద్దులయందు అక్షరాజ్యాల సైన్యాలకు, బ్రిటిషు సామ్రాజ్య సైన్యాలకు ఈ వారం చిన్న చిన్న సంఘర్షణలు మాత్రమే జరిగాయి.

లిబియాలో ఇంకను బ్రిటిషు స్వాధీనంలోవున్న టోబ్రూకు రేవు దుర్గంలోనుంచి బ్రిటిషు సైన్యాలు చుట్టును ముట్టడించియున్న శత్రుసైన్యాలమీద ఆకస్మికంగాపడి పలుసార్లు చాల వెనుకకు నెట్టివేశాయి. 9 వ తేదిన శత్రులు ''టాంకు''లను ఉపయోగించి దుర్గంలో కొంత భాగం ఆక్రమించడానికి ప్రయత్నించారు. బ్రిటిషు సైన్యాలు, శత్రుల తిరుగగొట్టుటయేగాక, శత్రు శిబిరాలలోకి చొచ్చుకొనివెళ్లి, చాల ప్రదేశాన్ని ఆక్రమించుకోగల్గాయి.

## రష్యా.

జర్మనులు యీ నెల 1 వ తేదిన రష్యా రాజధానియగు మాస్కో నగరమును పట్టుకొనుటకు ప్రారంభించిన బ్రహ్మాండమగు దాడి యింకా సాగుతూనేవున్నది. ఇంతవరకు జర్మను సైన్యాలు మాస్కోకు వుత్తరాన 110 మైళ్ల దూరములో వున్న కాలినిన్ నగరంవరకు, పడమటను 65 మైళ్ల దూరమునవున్న బొరిడొనో వరకును, దక్షిణాన 200 మైళ్ల దూరమున వున్న ఓరెల్ నగరమువరకును మాత్రమే రాగల్గిరి. వానికి వెనుకనువున్న బ్రియాన్స్కు, వియజ్మా నగరాలను రష్యనులు ఖాళీచేయవలసివచ్చింది. కాని అచట - జర్మను సైనిక పంక్తులవెనుక ఇంకా రష్యను సైన్యమున్నది. జర్మనులకు రష్యనులకుగూడ అచట భయంకరమగు పోరాటం జరుగుచున్నది. మాస్కోనుండి రష్యనులు లక్షలకొలది క్రొత్త సైన్యాన్ని యుద్ధరంగంలోకి దింపుతున్నారు. జర్మనులుగూడ క్రొత్త సైన్యాలను దింపుచున్నారు. ఉభయపక్షాలకును అచట "రామరావణ యుద్ధం" లాగ అతి భయంకరంగా యుద్ధం జరుగుచున్నది.

ఉత్తరాన మర్మంస్కు రేవు ప్రాంతంవద్ద లెనిన్‌గ్రాడు నగరంవద్ద జర్మను దాడిని రష్యనులు తిరుగగొట్టి, అపారమగు నష్టంకల్గించి వెనుకకు తరుముచున్నారు. దక్షిణాన యుక్రేన్ ప్రాంతంలో, కాకేసియా సరిహద్దులలోవున్న రోస్టావ్ నగరానికి 45 మైళ్ల దూరంలోకివచ్చితిమని జర్మనులంటున్నారు. 100 మైళ్ల దూరంలోనే వారిని నిలిపివేసితిమని రష్యను లంటున్నారు.

మాస్కో నగరం పడిపోయినా, రష్యనులు తుదివరకు యుద్ధం సాగిస్తూనేవుంటారుగాని లొంగిపోరని, రష్యా ప్రభుత్వ ప్రచురణాధికారియగు లొజొవస్కీగారు ప్రకటించారు.

అమెరికానుండి, బ్రిటనునుండి, రాత్రింబగళ్లు అపారమైన ఆయుధసామగ్రి రష్యాకు రుగుమతి చేయబడుచున్నదనీ, రష్యాకు సహాయలోపం యేమాత్రం వుండదనీ రూజ్వెల్టు అధ్యక్షుడును, బ్రిటిషు ఆయుధనిర్మాణ మంత్రియగు బీవరు బ్రూకుగారును ప్రకటించిరి.

వ్లాడివాస్టాక్ రేవుగుండా అమెరికానుండి రష్యాకు పెట్రోలు ఆయుధసామగ్రి నిరంతరాయంగా దిగుమతియగుచున్నది.

మంగోలియా—మంచుకో రాష్ట్రములకు గల సరిహద్దు వివాదాలను పరిష్కరించుకుంటూ, 15 వ తేదిన మంచుకోలో ఒడంబడిక చేసుకున్నాయి. దీనివలన రష్యాకు—జపానుకు గల వివాదకారణములు కొంతవరకు తొలగిపోతాయి.

## ఆక్రమిత ప్రాంతాలు.

జర్మనులు తాము జయించి ఆక్రమించిన దేశాలలో ప్రజలపై సాగించుచున్న దౌర్జన్యములకు అంతులేదు. గ్రీసులో అమితమగు అత్యాచారములు జరుపుచున్నట్లు, గ్రీసు ప్రభుత్వ ప్రధానికి వార్తలు వచ్చినవి. కొన్ని చోట్లముందు గ్రామములను లూటీచేసి, పిమ్మట వానిని తగుల బెట్టిరి. పారి పోవుచున్న ప్రజలను, స్త్రీలను, బాలురను వృద్ధులనుగూడ హత్యచేసిరి. ఒక చోట ముగ్గురు గ్రీకులను మొదట కొట్టి గాయపరచి వారు సజీవులయుండగనే పాతి పెట్టిరి. ఈ విధముగ హింసింపబడిన వారి భార్యలను పట్టుకొనివచ్చి- తమ కందరకు విందుల తయారుచేసి వడ్డింపవలెనని నిర్బంధించిరి. యుద్ధానంతరము, ఇటువంటి హింసలనే జర్మను రాజధానియగు బర్లిను నగరమున జరిపించవలెనని గ్రీకు ప్రధాని బ్రిటిషు ప్రధానమంత్రి చర్చిలును గోరెను. ఆక్రమిత ప్రాంతములలో ప్రజలను ఇటువంటి హింసలను పెట్టుచున్న జర్మను ఉద్యోగుల పేర్ల పట్టికను బ్రిటిషు ప్రభుత్వంవారు తయారుచేయుచున్నారు. యుద్ధానంతరం, వీరొనర్చిన నేరముల గురించి విచారణ జరిపి, శిక్షలు విధించుటకు ఈ పట్టిక ఉపయోగింపబడును.

జర్మను తంత్రజ్ఞులకు ఒక మనిషి అడ్డు దగిలెను అను కారణముచేత, జర్మను అధికారులు యుగోస్లావియాలో, ఆ మనిషియొక్క స్వగ్రామము నంతను తగులబెట్టిరి. అందు ఇంకను మిగిలియున్నవారిలో పురుషులనందరను ఖైదుకు పంపిరి.

జెకోస్లావెకియాలో, గత గురువారమునాడు, జర్మను సైనికాధికారులు మరి 12 మంది జెక్కు ప్రముఖులను వురిశిక్ష విధించిరి.

జర్మను అధికారులు, సర్వియాలో, ఇంతవరకు స్త్రీలు పిల్లలు, వృద్ధులు అనువిచక్షణలేకుండ 340 వేలమంది ప్రజలను హింసించి చంపివేసిరి.

## తటస్థ రాష్ట్రములు.

క్యూబా ప్రభుత్వము వెంటనే తన తాటస్థ్యమును వదలిపెట్టి అమెరికా బ్రిటనులతోకలసి ప్రజాప్రభుత్వముల రక్షణ కొరకు పోరాడుటకు సిద్ధముగనున్నదని, క్యూబా ప్రభుత్వాధ్యక్షుడగు కర్నలు బాటిస్టాగారు ప్రకటించిరి. ఆ ప్రకటనను గావించుటకు కొలది నిముషముల క్రిందటనే, ప్రభుత్వ మంత్రి వర్గ సమావేశము జరిగెను.

అమెరికా సంయుక్త రాష్ట్రములు మిత్రమండలి తరఫున యుద్ధములో దిగినయెడల, దక్షిణ అమెరికా రాష్ట్రములు గూడ వెంటనే యుద్ధమున దిగునని, అమెరికాలో సంచారమొనర్చివచ్చిన "సెబిల్‌హరా" అను జపాను పార్లమెంటు సభ్యుడు వెల్లడించెను.

## నౌకా నష్టాలు.

9 వ తేదిన బ్రిటిషు విమానములు మధ్యధరా ప్రాంతమున 6,000 టన్నుల నౌకను ముంచివేసెను. మరియొక నౌక శిథిల మొనర్పబడెను. నార్వే సముద్రతీర ప్రాంతంలో 1,000 టన్నుల నౌకయొకటి ముంచివేయబడెను. 1,500 టన్నుల పరిమాణంగల మరియొక నౌక తగులబెట్టబడెను. అట్లాంటికి సముద్రమున "లెడీషర్లీ" అను బ్రిటిషు ట్రాలరు నౌకకును, ఒక పెద్ద జర్మను జలాంతర్గామికిని చాలసేపు పెద్ద పోరాటముజరిగెను. తుదకు జలాంతర్గామి ముంచివేయబడెను. జలాంతర్గామిలోని 77 మంది నావికులు లొంగిపోయిరి.

"కార్ఫీల్డు" అను బ్రిటిషు నౌక శత్రులచే ముంచివేయబడెను.

సంగ్రమారంభమునుండి ఇంతవరకును జర్మను జలాంతర్గాములకును, ఆయుధములు అమర్చబడియున్న బ్రిటిషు వర్తక నౌకలకును జరిగిన పోరాటములలో 70 చోట్ల జలాంతర్గాముల దాడి తిరుగగొట్టబడెను.

అట్లాంటికు సముద్రమున ప్రయాణమొనర్చుచున్న "కార్టెల్ రీలు" అను పేరుగల, పోర్చుగీసు నౌకను జర్మను జలాంతర్గామి, టార్పెడోను ప్రయోగించి ముంచివేసెను.

యుద్ధ నౌకల తైనాతీతో అట్లాంటికు సముద్రమున ప్రయాణం చేస్తున్న బ్రిటిషు వర్తక నౌకలపై జర్మను విమానములు ఇటీవల దాడిసల్పెను. నాల్గు బ్రిటిషు నౌకలు మునిగిపోయెను. ఆ నౌకలనుండి కాపాడబడినవారిలో 80 మంది పోర్చుగలు తీరమున దింపబడిరి.

13 తేదీన, మధ్యధరా సముద్రములో బ్రిటిషు జలాంతర్గాములు, మూడేసివేల టన్నుల ప్రమాణంగల మరి మూడు శత్రు నౌకల ముంచివేసెను.

## దూరప్రాచ్యము.

బ్రిటను, అమెరికా, డచ్చి యీస్టిండియా దీవుల ప్రభుత్వములు, ఇకమీద జపానునకు ఏ విధముగు పెట్రోలునూ నెలను సరఫరా చేయరాదని పూర్తిగ నిషేధించెను. ఫిలిప్పైను దీవుల రాజధానియగు మనిలా నగరమునందు గడచినవారం బ్రిటిషు అమెరికా, డచ్చి యీస్టిండియా దీవుల, చైనా సైనికనాయకులు సమావేశమై, జపాను దురాక్రమణలసాగిస్తే, తాము జరుపవలసిన చర్యలగురించి సంప్రదించుకొనిరి. ఆ సంప్రదింపుల యొక్క మొదటి ఫలితమే—ఈ "పెట్రోలు" యెగుమతుల నిషేధమని జపాను నాయకులంటున్నారు.

బ్రిటిషు ప్రభుత్వము, థాయి ప్రభుత్వమును అక్ష-రాజ్యాలకు అనుకూలభావమును వదలి మిత్రమండలిలో చేరవలసినదని, వత్తిడి చేయుచున్నదని అక్ష-రాజ్యాధికారులు వదంతులు వ్యాపింప చేయుచున్నారు. అటుల వత్తిడి చేయుచుండిరను ఆరోపణ పూర్తిగ అసత్యమనియు, థాయిదేశమున మిత్రభేదమొనర్చుటకు ఉద్దేశింపబడినదనియు, థాయిదేశమందలి బ్రిటిషు రాయబారియగు సర్. జోషియా క్రాస్బీగారు ఖండించిరి.

దూరప్రాచ్యరక్షణ యేర్పాటులనుగురించి సంప్రదించుటకును, పరీక్షించుటకును, దూరప్రాచ్యమున బ్రిటిషు సర్వసేనాధిపతియగు సర్. బ్రూక్ పొఫాంగారు, ఆస్ట్రేలియా, న్యూజిల్యాండులలో పర్యటనమొనర్చుచున్నారు. చైనాలో, హూనాన్ రాష్ట్రమును ఆక్రమించుటకు జపానీయులు గడచిన నెల రోజులనుండియు చేయుచున్న ప్రయత్నములన్నియును భగ్నమయ్యెను. హూనాన్ రాష్ట్రరాజధానియగు చాంగ్షా నగరమును ఖాళీచేసి జపానుసైన్యాలు, షింట్సియాంగు అనే నదికి ఉత్తరానికి—అనగా తాము మొదటవున్న ప్రదేశములకు మరలిపోయిరి. చైనాసైన్యాలు, జపానీయులను ఇతర రంగాలలోగూడ వెనుకకు తరుముచున్నవి. ఇచాంగ్ అను రేవు పట్టణముకొరకు జరుగుచున్న యుద్ధంలో జపాను సైన్యాలు విషవాయువులను గూడ వుపయోగించిరని చైనాసైనికాధికారులు తెలుపుచున్నారు. చైనాసైన్యములు, జపానీయులను హూనాన్ రాష్ట్రమునుండి వెడలగొట్టుటయేగాక, చాల నెలలగా జపానీయుల ఆక్రమణయందున్న షాన్సీ రాష్ట్రముమీద, తామే తిరుగుదాడి సాగించుచున్నవి.

పడమటి రంగములలో రష్యనుల స్థితికి కష్టముగనుండుటచే — ఈ సమయముననే జపాను తూర్పువైపుననుండి రష్యాపై దాడి సాగింపవలెనని జపాను సైనికాధికారులు ఆలోచించుచున్నారు. అట్లా దాడి సాగించినయెడల, బ్రిటను, అమెరికాలు, జపానుపై దాడి సాగించునని హెచ్చరింపవలెనని, బ్రిటిషు పత్రికలు ప్రభుత్వమును హెచ్చరించుచున్నవి.

## విషీ.

విషీ ప్రభుత్వానికి—జర్మనీకి త్వరలోనే క్రొత్త యొడంబడిక యేర్పడుననని, దానివలన ఫ్రాన్సు—జర్మనీలు యెక్కువ సహకారముతో వ్యవహరించుచుండునని జర్మను పత్రికలు వ్రాయుచున్నవి.

---

సలహా: ఇకముందు చూచుకొనుటకు యీ మదరాసు యుద్ధ సంచికను మీరు భద్రపరచుకొనుడు.

[మదరాసు సమాచారముల ఆఫీసరుగారు తమ వందనములతో దీనిని మీకు పంపుచున్నారు.]

MADRAS : PRINTED BY THE SUPERINTENDENT, GOVERNMENT PRESS.